# నవగ్రహ గాయత్రి

Acc No. 8644

బ్రహ్మ మురారి స్త్రిపురాంతకారీ।
భానుః శశీ భూమిసుతో బుధశ్చ।
గురుశ్చ శుక్రః శని రాహు కేతవః।
సర్వేగ్రహాః శాంతికరా భవంతు॥

రచయిత:
కల్లూరి సూర్యనారాయణ.

ప్రథమ ముద్రణము
1983 – జూలై
ప్రతులు : 1000
వెల : రూ॥ 5–00

ముద్రణ :
లలితా ఆర్టు ప్రెస్సు,
టౌనుహాలు రోడ్డు,
విశాఖపట్నం – 1.

## —: సంప్రదించిన పుస్తకముల పట్టిక :—

1. నవగ్రహస్తుతిః—

శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యము

2. నవగ్రహస్తోత్రములు—

శ్రీ ఏలూరి సీతారామ్

4. శనిస్తోత్రము—

శ్రీ పొన్నాడ వీరాచార్యులు

3. నవగ్రహస్తోత్రము—

వావిళ్ళ రామస్వామిశాస్త్రులుఅండుసన్సు

5. నవగ్రహస్తోత్రమ్—శనికి ప్రత్యేకశాంతి విధానము—స్తోత్రము—

శ్రీ వడ్డాది వీర్రాజు

6. నవగ్రహస్తోత్రమ్—

వోలేటి రామనాథశాస్త్రి

7. శ్రీసత్యనారాయణ వ్రతకల్పము—

పండిత పరిష్కృతము

8. నవగ్రహగాయత్రి—

గాయత్రీ మన్త్రకోశము

———

ఓం శ్రీ గాయత్రీ దేవ్యై నమః

బ్రహ్మాత్రకుంచికాహస్తాం శుద్ధజ్యోతిస్వరూపిణీం।
సర్వతత్త్వమయీం వందే గాయత్రీం వేదమాతరమ్॥



ముక్తావిద్రుమ హేమనీల ధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణైః
యుక్తామిందునిబద్ధరత్న మకుటాం తత్వార్థ వర్ణాత్మికాం।
గాయత్రీం వరదాభయాం కుశకశాశుభ్రం కపాలంగదాం।
శంఖంచక్ర మధారవిందయుగళం హస్తైర్వహంతీంభజే॥

దైవజ్ఞ, ఆగమపండిత, ఆచార్య, భాషాప్రవీణ
బ్రహ్మశ్రీ చల్లా రామగణపతిశాస్త్రి
(రాజమండ్రి).

# అభిప్రాయము

శ్లో॥ సుఖార్థాః సర్వభూతానాం
మతాస్సర్వాః ప్రవృత్తయః
సుఖం చ న వినా ధర్మా
త్తస్మా ద్ధర్మ పరోభవ॥

అను నార్ష వాక్యము జీవులందరూ సుఖమునే గోరి చరించుచున్నా రనియు సుఖము ధర్మపరాయణులకు లభించు ననియు ధర్మము నాచరింపని వారికి సుఖము లభింపదనియు దెలుపుచున్నది. ధర్మ మనగా వేదాదులందు విధింపబడు కర్మోపాసనాదుల నాచరించుటచే జనించు పుణ్యవిశేషము. కర్మ మార్గము బహువ్యయప్రయాసాది సాధ్యమగుటంజేసి యుపాసనా మార్గమే పురుషార్థ సాధనములలో సూక్ష్మోపాయము.

మానవజీవితముపై పరిసరములతోబాటు దేవతా ప్రభావము గూడగలదని భారతీయ సంప్రదాయము. శిశువు జన్మింపగనే గ్రహ సంపత్తి యెట్లున్నదని విచారించుట యనూచానముగా వచ్చుచున్న సంప్రదాయము. ఖగోళములోనున్న గ్రహము లన్నిటికి అధినాథుఁడు సూర్యుఁడు.

గ్రహములు మానవుల పూర్వ జన్మ కర్మలను వాని ఫలములను నిర్ణయించును. తదనుసారముగా మానవ జీవయాత్ర సాగుచుండును. శరీర నిర్మాణము నను తను పుత్ర కళత్రాది భావములందును గ్రహముల ప్రభావ మెంతయైన కలదు. గ్రహ గమనమును బట్టి ఆయాజీవులు కష్టసుఖములననుభవించుచుందురు. కష్టము కలిగినపుడు ఆ కష్టమునకు కారణభూత మైన గ్రహస్థితిని గమనించి ఆయాగ్రహముల అనుగ్రహము ద్వారా తమ కష్టములను తొలగించుకొనుట కెల్లరూ ప్రయత్నింతురు. గ్రహప్రీతి కొఱకై జపము, తర్పణ హోమాదులు, దానములు, స్తోత్రపాఠములు జరుపుచుందురు.

నవగ్రహ మంత్రములలో వైదికములు తాంత్రికములు, పౌరాణికము లని మూడు విధములు కలవు.

వీనిలో వైదిక మంత్రములు శిరోమాణిక్యము వంటివి. కాని ఆ మంత్రములు స్వరయుక్తమై యుండుటచే గురుముఖముగా సుస్వరయుక్తముగానభ్యసింపవలసి యున్నది. ఇది కష్టతరమైనది. మంత్రద్రష్టలగు మహర్షులు నవగ్రహ మంత్రములను గాయత్రీమంత్ర గర్భితము గావించియుండిరి. నవగ్రహ గాయత్రీ మంత్రానుష్ఠానము సులభతర మగుటచే నెల్లరకూ అనుష్ఠాన యోగ్యమైనది.

ప్రకృత మీ గ్రంథమున నవగ్రహ గాయత్రీ మంత్రములతో బాటు తాంత్రిక వైదిక మంత్రములు పౌరాణికములగు స్తోత్రాదులు కలవు. మరియు ఇందు ప్రతి మంత్రమునకు అర్థము ఆయా గ్రహముల స్వరూప స్వభావములు మొదలగు పలు విశేషములు వివిధ గ్రంథముల నుండి సంకలన మొనరించియుండిరి. ఇట్టి సమగ్ర గ్రంథ రాజమును సంకలన మొనరించి ఆంధ్ర పాఠక లోకమునకు అందిచ్చి యుపకార మొనర్చిన బ్రహ్మశ్రీ కల్లూరి సూర్యనారాయణగారు అభినందనీయులు. వారికి వారి కుటుంబమునకు ఆ గాయత్రీ పరాదేవత ఆయురారోగ్య ఐశ్వర్యాదుల నొసంగి యిట్టి మహత్తర గ్రంథముల నింకనూ ప్రకటించుటకు శక్తి సామర్థ్యము లొసంగవలయు నని కోరుచుంటిని.

# కృతజ్ఞతలు

వ్యాసప్రోక్తమైన నవగ్రహస్తుతి బహుళవ్యాప్తిలో నున్నది. నవగ్రహములకు గాయత్రి మంత్రములు కూడ గలవు. ఆయా నవగ్రహములను మనలను గ్రహ బాధలనుండి బ్రోవమని ప్రార్థించుటయే ఈ నవగ్రహ గాయత్రి మంత్రములయొక్క వినియోగము. అట్టి నవగ్రహ గాయత్రి మంత్రములనుకూర్చి వాటిని జనా దరణకొఱకు, నవగ్రహ ప్రీతికొఱకు అందించవలయు నను ముఖ్యోద్దేశముతో ఈ నవగ్రహ గాయత్రి ముద్ర ణకు పూనికొనినాను. మరియు వేదములందలి నవ గ్రహ మంత్రములనుకూడ ఇందు పొందుపఱచి నాడను. ఇందు శనిజపమునందుపేర్కొనబడిన వ్యాస ప్రోక్తమైన బీజాక్షరములకు వేదములందు జెప్పబడిన వానికి తేడాకలదు. అందున వాటిని వినియోగము గురుముఖముగ తెలిసికొనదగును.

ఈ గ్రంధవిషయమున నాకు తోడ్పడిన బ్రహ్మశ్రీ చిలుకూరి రామభద్రశాస్త్రిగారికి, బ్రహ్మశ్రీ ములుకుట్ల వరప్రసాదమూర్తిగారికి నా హృదయపూర్వక నమ

స్కారములు. మరియు ముద్రణవిషయమున ప్రూఫు లను సరిదిద్ది నాయందమిత వాత్సల్యముతో నాకు సహాయమందించిన బహుముఖ ప్రజాశీలురు బ్రహ్మశ్రీ ర్ల గణపతిశాస్త్రిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞ భి వందనములు.

నేను కోరగా అభిప్రాయమును వ్రాసియిచ్చిన ర్వజ్ఞ, ఆగమపండిత, ఆచార్య, భాషాప్రవీణ బ్రహ్మశ్రీ ల్లా రామగణపతిశాస్త్రిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతానమస్సులు.

ఈ ముద్రణవిషయమున నన్ను ప్రోత్సహించిన నా భార్య చి॥ సౌ॥ సుధకు నా శుభాకాంక్షలు.

విశాఖపట్నం, శ్రీ గాయత్రీసేవాతత్పరుడు,
8–7–83, కల్లూరి సూర్యనారాయణ.

# ❁ విషయసూచిక ❁



---

# నవగ్రహ గాయత్రి

ఓం మహాగణపతయే నమః

ఓం శ్రీ గాయత్రీదేవ్యై నమః

## నివేదన

శ్లో॥ ఆదిత్యాయచసోమాయమంగళాయ బుధాయచ।
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః॥

ప్రతి మానవుడు జన్మించినది మొదలు తన జీవిత కాలములో దైవాను గ్రహఫలితములనుగాని, పూర్వ జన్మార్జితమైన కష్టములను తొలగించుకొని, తనకు సంప్రాప్తమగు సుఖములనుగాని, అనుభవించుటకు గ్రహానుకూలత లేనిదే వలను పడదు. ఇది జగమెరిగిన సత్యము. అట్టిగ్రహానుకూలత వలననిత్యజీవనమునందు గలుగు కష్టములు, దారిద్ర్యము, శత్రుమూలకబాధలు, వ్యవహారసంబంధమైన చిక్కులు, ఋణబాధలు. సంసార ఛిద్రములు, రోగపీడలు, విఘ్నములు మొదలగునవి ఎదుర్కొని స్వప్రయోజనమునకు సర్వ ఫలితములను పొందవచ్చును.

ఓం శ్రీగాయత్రీ దేవ్యైనమః

## నవగ్రహములు – స్వరూపస్వభావములు :

సూర్యుడు : సూర్యుని కిరణములు ప్రపంచమును పవిత్రము చేయును. ఇవి శారీరక మానసికబాధలను పోగొట్టుటలో సమర్థమైనవి. సూర్యోదయ సమయమున సూర్యబింబము సముద్రజలము నుండి వచ్చుచున్నట్లు కనుపించును. సింహరాశి అధిపతియైన సూర్యనారాయణుడు నేత్రములకు, రాజ్యములకు కారణభూతుడు. శ్రీసూర్యదేవునకు సంజ్ఞ, ఉష, ఛాయ అను ముగ్గురు భార్యలు కలరు. అందు సంజ్ఞదేవినాసిక నుండి ఉద్భవించిన అశ్వినీ దేవతలు దేవవైద్యులుగా ప్రసిద్ధి గాంచిరి. అట్టి వారిచేత సేవింపబడు సూర్యుని త్రిమూర్తులు సేవించుచున్నారు.

బ్రహ్మ, విష్ణు, రుద్రరూపుడై ఎనిమిది శరీరములు

[illegible]

[illegible]

గాక !

సూర్యుడు తొమ్మిదివేల యోజనముల పరిణామము కల్గి, ముగ్గురు భార్యలను కల్గి ఇతర గ్రహముల

బాధను తగ్గించుగాక ! సూర్యునకు సుషుమ్న మొదలుగా గల ఏడు ముఖ్యమైన కిరణములుగలవు. ఈతడే మనుష్యులను, పితృదేవతలను పోషించుచున్నాడు. ఈతడు శ్రీమహావిష్ణువునకు దక్షిణనేత్రముగ వెలుగొందుచున్నాడు. అదితి పుత్రుడగు సూర్యుని మండలము అగ్నిజ్వాలతో కూడినది. అది స్వర్గము కంటెను శ్రేష్ఠమైనది. విశాఖానక్షత్రమున జన్మించినవాడు. గ్రహములలో మొదటివాడు. గ్రహములకు ప్రభువుగా ఈశ్వరునిచే స్థాపింపబడినవాడు.

ఈతడు సహస్ర పద్మమునందు ధ్యానింపబడుచున్నాడు. ఈతడు పరబ్రహ్మ స్వరూపుడు, సూర్యుడు అస్తమించుటగాని, ఉదయించుటగాని లేవు. అతను కనిపించుటయే ఉదయం. కనిపించకపోవుటయే అస్తమయము. ఇతడు రసజ్ఞుడు. పద్మినీ స్త్రీలహృదయము మును రంజింపజేయును. శృంగార భావములతో నుండును. మంచి వస్త్రములను ధరించును. కాంతావదనమును బొంది తహతహలాడును తులారాశియందు పదవభాగము ఆశ్రయించినవాడై, అన్ని గ్రహములు ప్రకాశించుచున్నవైననురాజయోగములను చెడగొట్టునో అట్టి గ్రహరాజేసూర్యుడు. సూర్యుని తేజస్సు అమృత స్వరూపము. అట్టి అమృతరూపమైన తేజస్సు కాలగమనముచే జీవుల నందరనూ నశింపజేయుచున్నది.

సూర్యమండలము యజ్ఞమందలి బంగారము సూర్యుని కాంతి కంటియందలి తెల్లనిభాగము. దళము కంటి యందలి నల్లని భాగము. సూర్యుని యందలి పురుషుడు కంటియందలిపురుషునిగ ఉపాసనచేయబడు చున్నాడు (శతపథబ్రాహ్మణము) ఎడమ కంటియందలి నల్లగ్రుడ్డునూ, దక్షిణనేత్రమందలి సూర్యభగవానుడును కలిసి మనస్సునందు ఐక్యమును పొందుచు మోక్షము కలుగజేయుచున్నారు. ముత్యపుచిప్ప యందు వెండి భాసించినట్లు, ఏదేవుని యొక్క మండలమునందు ప్రపంచమంతయు భాసించుచున్నదో ఆకాశమనెడిస్త్రీని ఏదేవుడు అనుసరించుచున్నాడో, అతఁడుసా్వ్యప్యమఁడు అని పిలుపబడుచూ ప్రపంచమునకు ముఖ్యప్రాణమై సూర్యభగవానుడుగ విలసిల్లుచున్నాడు.

ఊర్ధ్వముగా వెళ్ళుచూ ప్రాణులకు తన తేజస్సు నందు నివాసమును కల్పించును. ఈయన అగ్ని స్వరూపుడై, ఆత్ముడై, సహస్రకిరణుడుగ విలసిల్లును. ఈయన రక్త వస్త్రములను ధరించి స్వర్ణకమలములను హస్తమున ధరించి, పగటిని కలుగజేయును. ఇంద్రు నకు ధనస్వరూపుడు. పితృదేవతలకుస్వధారూపము. రాక్షసులకు మాయారూపుడు. దేవతలకు ఆహారమైన అమృతముగ నున్నాడు. ఈతడు చైత్ర, వైశాఖాది

మాసములందు భిన్నమైన నామములచే పిలువబడుచున్నాడు. ఈతని రథమును పద్మోడవెడు వ్యక్తి ధరించుచున్నాడు. సూర్యుడు జమదగ్ని మహర్షికి లోకోపరారము కొఱకు గొడుగును, పాదుకలను. సత్రాజిత్తునకు శమంతకమణిని, వనవాసమందున్న యుధిష్ఠిరునకు అక్షయపాత్రను నొసంగి మహోపకారము చేసెను.

సూర్యుడు అశ్వరూపము ధరించి యాజ్ఞవల్క్య మహర్షికి యజుర్వేదము నుపదేశించెను. ఆంజనేయునకువ్యాకరణశాస్త్రమునుబోధించెను సూర్యుడుసాంబుని కుష్ఠురోగమును నివారించెను. సూర్యుడుఅరనిమిషమునకు 2,200 యోజనముల దూరం ప్రయాణం చేయుచు లోకములకు ప్రభువైనాడు. భూమి, ఆకాశము, నీరు, వాయువు, తేజస్సు అను పంచభూతములు సూర్యుని నుండి ఆవిర్భవించినవి. ఈతడు ఇంద్రునిచే ప్రతిష్ఠింపబడిపూజింపబడుచున్నాడు. పాయసమునందు ప్రీతి కలిగిననాడు. ఈతని వంశమున శ్రీమహావిష్ణువు జన్మించెను. ఈతడు కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ అను మూడు నక్షత్రములకు అధిపతి. బుద్ధికి దీప్తి కలిగించుచు లోకమునకు దీపము వంటివాడు సూర్యభగవానుడు. జపాపూవురంగు కలవాడు. కశ్యపమహాముని కుమారుడు మహాతేజస్సంపన్నుడు వెలుంగు నొసర్చగు

వాడును, పాపసంహారియు నగు సూర్యభగవానునకు నమస్కారము.

1. శ్రీసూర్య స్తోత్రము.

శ్లో॥ జపాకుసుమ సంకాశం
కాశ్యపేయం మహాద్యుతిం
తమోరిం సర్వపాపఘ్నం
ప్రణతోస్మి దివాకరం॥
(శ్రీ వ్యాసమునిప్రోక్తం)

సూర్యమంత్ర ధ్యానము.

ద్విభుజం పద్మహస్తంచవరదం మకుటాన్వితమ్।
ధ్యాయేద్దివాకరం దేవం సర్వాభీష్టప్రదాయకమ్॥
శ్రీ సూర్యనారాయణాయ నమః.

మంత్రము.

"ఓం హ్రాం హ్రీం హ్రౌం సః సూర్యాయనమః"
సూర్యునకు 6 వేలు జపసంఖ్య.

ఫలశ్రుతి: శరీరారోగ్యము చెడిపోయి బాధపడు వారు ప్రతి ఆదివారము ఉదయము రవిధ్యానము చేయవలయును.

చంద్రుడు.

ఈతడు సంపదలనొసంగును. సూర్యచంద్రులు భగవంతునకు రెండునేత్రములు. తెల్లనిరంగు గల వాడు, మృదువయిన వాక్కుగలవాడు. అత్రిముని నేత్రమునుండి పుట్టినవాడు. మంచిమేధాసంపత్తి గల వాడు. గొప్పవయిన ఓషధులకు ప్రభువు.

కాంతాప్రియులకు పెన్నిధి. శివునిశిరస్సు నలంక రించినవాడు. చంద్రుడు మనుజుల మనస్సును ధర్మ మార్గములను ప్రబోధించును. చంద్రుడు అమృతముతో దేవతలను రంజింప జేయుచున్నాడు. పాలసముద్ర మున పుట్టినచంద్రుడు శివుని కిరీటమునకు అలంకా రము.

ధర్మమూర్తి, మేధాయశస్సంపన్నుడు, కృత్తికా నక్షత్ర జాతకుడగు చంద్రుడు మనకు ప్రశాంతిని కలుగ జేయును. ఈతడు శ్రీ లలితాంబయొక్క లలాటమున శోభిల్లుచూ మనకు ధర్మమార్గమును ఉజ్జ్వల భవిష్య త్తును ప్రసాదించుచున్నాడు. దేవీభక్తులకు చిత్కలా జ్ఞానమునందించును. చతుష్షష్ఠికళలను సమదృష్టిని కలుగజేయును. నక్షత్రములకు ప్రభువు. చకోరపక్షు లకు ప్రీతికరుడు. తన కిరణములచే అమృతమును ప్రసరింపజేయును.

శ్రీ చంద్ర స్తోత్రము.

శ్లో॥ దధిశంఖ తుషారాభం
క్షీరోదార్ణవ సముద్భవం
నమామి శశినం సోమం
శంభోర్ముకుట భూషణం॥

(శ్రీ వ్యాసముని ప్రోక్తం)

చంద్రధ్యానము.

జటాధర శిరోరత్నం శ్వేతవర్ణం నిశాకరమ్
ధ్యాయే దమృతసంభూతం సర్వకామఫలప్రదమ్॥

మంత్రము.

ఓం శ్రాం శ్రీం శ్రౌం సః చంద్రాయనమః
చంద్రునకు 10 వేలు జపసంఖ్య.

ఫలశ్రుతి:

బుద్ధి, మెదడులకు సంబంధించిన అనారోగ్యము కలిగినపుడు చంద్రుని ధ్యానించవలయును.

3. కుజుడు (అంగారకుడు):

భూదేవిపుత్రుడు. మేషవాహనము కలవాడు. మేధావి. మేష వృశ్చికరాసులకు అధిపతి. ఎఱ్ఱని వస్త్రములు ధరించినవాడు. కుజుడుసాహసము, సైన్యము,

కోటలను, సేనాధికారమును నొసంగును. భూదేవి శ్రీమహావిష్ణువును ఆలింగనము చేసికొనినపుడు, ఈయన అవతరించెను. సూర్యగ్రహమునకు మిత్రగ్రహము. ఈతడు అంటువ్యాధులు, వ్రణములు, కీటకములు, ఋణములనుండి కాపాడును. ఈయనయందు సజ్జనత్వము, ఆచారత్వము, మైత్రి అను గుణములుకలవు. ఈతను పైత్యకారకుడు. కారము వేడివస్తువులందు ప్రీతి గలవాడు. సోదరసంపత్తి నొసంగువాడు. క్రూరదృష్టి కలవాడయినను ఈతనిభక్తులకు శత్రునాశకుడగును. తమోగుణ యుతుడును, వంటయింటి కధిపతియు, న్యాయశాస్త్రము దండనీతికి అధిపతియు నగు కుజుడు పాండిత్యమునిచ్చును. ఏడు సంవత్సరములీతనికాలము ఈతడు రాజభోగమును, అధికారమును ప్రసాదించును. ఈతడు అగ్నిస్వరూపుడు. ఈశ్వరభక్తుడు. దక్షిణ దిక్కునకు అధిపతి. ఇతనిరథము ఎనిమిది రంగులతో కూడి యున్నది. పూర్వాషాఢ నక్షత్రమున పుట్టినవాడు. శక్తిని చేతియందు ధరించువాడు.

శ్రీ కుజశ్లోకము.

శ్లో॥ ధరణీగర్భ సంభూతం
విద్యుత్కాంతి సమప్రభం

కుమారం శక్తిహస్తం తం
మంగళం ప్రణమామ్యహం॥

(శ్రీ వ్యాసముని ప్రోక్తం)

కుజమంత్ర ధ్యానము.

రక్తమాల్యాంబరధరం మేషారూఢం చతుర్భుజం
శక్తిశూలగదాపద్మాన్ ధారయంతం కరాంబుజైః
అంగారక మహీపుత్రభగవాన్ భక్తవత్సల
నమో మహాశేషఋణమాశు వినాశయ
రక్తగంధైశ్చ పుష్పైశ్చ ధూపదీపైర్గుణోదకైః॥

ఓం మహీసుతాయనమః

మంత్రము:

ఓం క్రాం క్రీం క్రౌం సః భౌమాయనమః

కుజునకు 7 వేలు జపసంఖ్య

ఫలశ్రుతి :

ఋణములు, వ్రణములకు, కలహములకు కారకుడు. ఈ బాధలు తొలగుటకు కుజుని ధ్యానము చేయవలయును.

4. బుధుడు :

[illegible] అందగాడు, [illegible]

చంద్రశత్రువు. కన్యామిథున రాశులకు ప్రభువు. కన్యారాశి ఉచ్ఛగాగలవాడు. సూర్యునకు మిత్రుడు. విద్యాం

సుడు, గుండ్రనిశరీరము కలవాడు, చిలుకను ధరించు వాడు. తారాచంద్రులయొక్క పుత్రుడు. శనికి మిత్రుడైనను గొప్ప పరాక్రమము గలవాడు. పదునేడుసంవత్సరములు వీని కాలపరిమితిగా జ్యోతిషశాస్త్రముచే నిర్ణయింపబడినది. వ్యాపారము, శాస్త్రజ్ఞానము, పరిహాస వచనములు, శిల్పము, క్రీడాగారము, భూతత్త్వము, వాక్కు, రజోగుణము, మేధకు కారకుడు ధనిష్టానక్షత్రమునజన్మించినవాడు, పంచకిరణుడు, కపిలవర్ణముగల ఎనిమిది అశ్వములతోకూడి జలాగ్నులచే ప్రకాశించు సౌందర్యయుక్తుడు, కంఠమునందు న్యాసము చేయుదగినవాడు. సూర్యునకు ఇరువది ఎనిమిదవ భాగము నతిక్రమించి వెళ్ళనివాడో అట్టి బుధునకు ప్రశాంతచిత్తునకు నమస్కృతులు.

శ్రీ బుధస్తోత్రము.

శ్లో॥ ప్రియంగు గుళికాశ్యామం
రూపేణాప్రతిమం బుధం
సౌమ్యం సత్యగుణోపేతం
తం బుధం ప్రణమామ్యహం॥

(శ్రీ వ్యాసముని ప్రోక్తం)

బుధధ్యాన మంత్రము.

సింహారూఢం చతుర్బాహుం ఖడ్గచర్మ గదాధరం।
సోమపుత్రం మహాసౌమ్యం ధ్యాయేత్సర్వార్థ
సిద్ధిదమ్॥

294592
SUR ACC.NO.18644



మంత్రము:
ఓం బ్రాం బ్రీం బ్రౌం సః భౌమాయనమః
జపసంఖ్య : 17 వేలు జపము చేయవలయును.
ఫలశ్రుతి :
వ్యాపారమునకు సంబంధించిన చిక్కులు కలుగు చున్నప్పుడు బుధుని ధ్యానము చేయవలయును

5. గురుడు (బృహస్పతి)

శుభలక్షణుడు, మూడులోకములకు గురువు. సర్వ విద్యలకు ఆధారభూతుడు. సర్వులచే పూజింపబడు వాడు. సర్వాభీష్టములను తీర్చువాడు, మహాబలుడు, దేవతలకు, ఋషులకు గురువయినవాడు, ఇంద్రునకు కూడ ఆచార్యుడు. శనికూడ శిష్యునిగ గలవాడును, బుద్ధిని సంతానమును ఇచ్చువాడును, కర్కటము ఉచ్ఛరాశిగ గలవాడును, ధనుర్మీనములకు అధిపతి యును, ఈశ్వర స్తోత్రముచేత సంతోషపడువాడును, ఈశాన్యదిక్కునకు ప్రభువును, సకలకళా ప్రపూర్ణుడును అంగిరసుని పుత్రుడును, ఫల్గునీ నక్షత్రమున జన్మిం చినవాడును, పసుపుపచ్చఛాయ మరియు పండ్రెండు ముఖ్యమయిన కిరణములు గలవాడును, హృదయ మందు న్యాసము చేయువలసినవాడును, బ్రహ్మవేత్త లకు శుభము కలుగజేయువాడగు గురువునకు నమ స్కారములు.

గురు స్తోత్రం:

శ్లో॥ దేవానాంచ ఋషీనాంచ
గురుకాంచన సన్నిభం
బుద్ధిమంతం త్రిలోకేశం
తం నమామి బృహస్పతిం.

(శ్రీ వ్యాసముని ప్రోక్తం)

గురుమంత్ర ధ్యానము:

వరాక్షమాలా దండంచ కమండలుధరం విభుమ్
పుష్పరాగాంకితం పీతం వరమం భావయేద్గురుమ్॥

మంత్రము :

ఓం గ్రాం గ్రీం గ్రౌం సః బృహస్పతయేనమః

జపసంఖ్య : 16 వేలు జపముచేయువలయును.

ఫలశ్రుతి :

ధనమునకు, పుత్రులకు, విద్యకు కారకుడు. ఇవి కోరువారు గురుని ధ్యానించవలయును.

6. శుక్రుడు :

రాక్షసులను రక్షించుటకై సంజీవినీవిద్యను ధరించినవాడును, ఎవనిపాదములను ఇంద్రుడు తన ఉచ్చైశ్వర్యములకు సదా సర్చించుచుండునో, కచునకు సర్వ సర్వశాస్త్రములు బోధించెనో, వృ[illegible] బోధించెనో, సర్వపాప సంహారకుడును, గొప్ప దయాళువునగు నీశ్వరునకు ఈతడు శిష్యుడు.

దేవాసురయుద్ధమున మరణించిన అసురులను శుక్రుడు బ్రతికించుచుండెను. అదిగాంచి శంకరుడు అతనిని మ్రింగివేసెను. శివుని కడుపునందు శుక్రుడు సర్వలోకములను జూచి బయటకు వచ్చి శివునిచే మిక్కిలి కొనియాడబడెను. ఈతడు సాహిత్య, సంగీత, మంత్ర, తత్త్వజ్ఞానముల నొసంగువాడు. తీక్షణమైన చూపులు కలవాడు. జ్ఞానులలో అగ్రగణ్యుడయినవాడును, స్త్రీల వలె మృదువయినవాడునగు నీతని రథము పది గుఱ్ఱములచే వహింపబడుచున్నది. పుష్యమీ నక్షత్రమున జన్మించినవాడు. పదునారు కిరణములు గలవాడు. లంబికాస్థానమునందు న్యాసము చేయుటచే తృప్తి నొందువాడు. పంచాక్షరీ మంత్ర జపముతో ప్రీతి నొందువాడు. వర్షములు ప్రసాదించు శుక్రునకు నమస్కారము.

శ్రీశుక్రస్తోత్రము:

శ్లో॥ హిమకుందమృణాలాభం।
దైత్యానాం పరమం గురుం।
సర్వశాస్త్ర ప్రవక్తారం।
భార్గవం ప్రణమామ్యహం॥

(శ్రీవ్యాసప్రోక్తం)

మంత్రధ్యానము:

జటిలం సాక్ష సూత్రంచవరదండ కమండులుం।
శ్వేతవస్త్రావృతంశుక్రం ధ్యాయేద్దానవపూజితం॥

మంత్రము :
ఓం ద్రాం ద్రీం ద్రౌం సః శుక్రాయనమః
జపసంఖ్య : 6 వేలు జపము చేయవలయును.
ఫలశ్రుతి :
భార్య, వాహనము, భోగము, నాట్యము, సంగీతం, నాటకకళ వీటిని కోరువారు శుక్రుని ధ్యానము చేయవలయును.

7. శని :

ఆత్మ జ్ఞానియైన మహేశ్వరుని గూడ చెట్టుతొఱ్ఱలో ఉండునట్లు చేసినవాడును, సూర్యపుత్రుడు, నల్లని వస్త్రములతో గూడినవాడు, మకర కుంభరాసులకు అధిపతియు, ఆయుర్దాయము నొసంగు వాడును. కాకి వాహనము గలవాడును, దశరథునిచేతను, రాజ్యభ్రష్టుడైన నలునిచేత పూజింపబడినవాడును, పిప్పలాదులచేనుతింపబడినవాడును, కాశ్యపవంశమునజన్మించినవాడును, కాలపురుషుని యొక్క మోకాళ్ళు, తొడల యందు ప్రకాశించువాడును, మందగమనము కల వాడును, నల్లని పది గుఱ్ఱములతో కూడిన వాడును నీలమణి, కాటుకలతో సమాన కాంతి గలవాడును. సూర్యనందనుడును, యమధర్మరాజు యొక్క జ్యేష్ఠ సోదరుడును, ఛాయాసూర్యనారాయణులకు పుట్టిన వాడును, నాభియందు న్యాసము చేయదగినవాడును,

ఏడు కిరణములు కలవాడును, రేవతీ నక్షత్రమున పుట్టినవాడును, దీర్ఘ రోగములు కలవాడును, నిత్యము ఆకలికలిగిన తృప్తిలేనివాడును, కాలాగ్ని వంటి రూపము గలవాడును, యమునివంటివాడు, భీకర ఆకారము గలవాడు, తపస్సుచే దగ్ధమైన దేహము కలవాడును, ఎల్లప్పుడు యోగవాంఛకలవాడు, జ్ఞాననేత్రములు కల వాడు, ఆనందించినచో రాజ్యాదుల నిచ్చువాడు, చూపు సోకినింత మాత్రమున దేవ, దానవ, మానవ, పశు, పక్షి, సర్పాదుల దీనత్వము నొందించువాడు. అతని చేత చూడబడితే, దేశ, నగర, గ్రామ, ద్వీపములు నశింపబడును. మహాబలవంతుడగునట్టి శనిరాజునకు నమస్కారము.

శని స్తోత్రము :

శ్లో॥ నీలాంజన సమాభాసం
రవిపుత్రం యమాగ్రజం
ఛాయామార్తాండ సంభూతం
తం నమామి శనైశ్చరం॥

(శ్రీ వ్యాసముని ప్రోక్తం)

శనిమంత్ర ధ్యానము :
నీలాంబరో నీలవపుః కిరీటీ
గృధ్రస్థితస్త్రాసకరోధనుష్మాన్॥

చతుర్భుజ సూర్యసుతః ప్రశాంత
స్సదాస్తుమహ్యం వరదః ప్రసన్నః
మంత్రము :

ఓం ప్రాం ప్రీం ప్రౌం సః శనయేనమః
జపసంఖ్య : 19 వేలు జపము చేయవలయును.

ఫలశ్రుతి :
పాపుడు, నపుంసకగ్రహము. శనిబాధ తొలగి
సుఖము, అభివృద్ధి కలుగుటకు ధ్యానించవల
యును.

8. రాహువు :

సింహిక యను నామెకు బుట్టినవాడును, చంద్ర
సూర్యులను పీడించువాడును, సగము శరీరముగల
వాడును, సర్పరూపుడును, వైధవ్య విప్లవమునకు
మూలకారకుడును, కేవలము శిరస్సు కలవాడును,
ఉత్తములకు ఇష్టుడును, తీవ్రకిరణములుగల సూర్యుని
గూడ మ్రింగువాడును, నైరుతి దిక్కునకు ప్రభువును,
ఆగ్రహము కలిగిన శ్మశాన నివాస మిచ్చువాడును,
అనుగ్రహించిన సర్వసౌఖ్యముల నొసంగువాడును,
గొప్పఛాయ గలిగినవాడును, ఎనిమిది గుఱ్ఱములతో
గూర్చబడిన రథము నధిరోహించినవాడును, తామస
మైన స్థానము నందినవాడును, మూలాధార చక్రము

పై భాగమున ధ్యానింపబడువాడును, గోమేధము ప్రకాశించువాడును, రాశిచక్రమునందు మేషయానాది క్రమములో సంచరించువాడును, సుదర్శన చక్రముచే భేదింపబడిన కంఠము కలవాడును, అమరుడును, సద్గుణములు గలవాడును, విష్ణుభక్తులలో గొప్పవాడును అగు రాహువునకు నమస్కారము.

శ్రీరాహుస్తోత్రము :

శ్లో॥ అర్ధకాయం మహావీరం
చంద్రాదిత్య విమర్దనం
సింహికాగర్భ సంభూతం
రాహుంతం ప్రణమామ్యహం॥
(శ్రీవ్యాసముని ప్రోక్తం)

రాహుమంత్ర ధ్యానము :

కరాళ వదనం ఖడ్గ చర్మశూల వరాన్వితం।
నీలసింహాసనం ధ్యాయే
ద్రాహుంతంచ ప్రశాంతయే ॥

మంత్రము :

ఓం, భ్రాం భ్రీం భ్రౌంసః రాహవేనమః

జపసంఖ్య :

[illegible] 18 [illegible] చేయవలయును,

[illegible] :

ఇతడు చండాలుడు, స్త్రీ, గృహము, అశుభ ఫలి ములకు ధ్యానింపవలయును.

9. కేతువు:

యోగిరూపములో సకలజనులకు ఆనందము గూర్చువాడు, మునులచే నుతింపబడువాడును, స్వాత్మ రూపముగ భాసించువాడును, గుణవంతుడు నయిన ట్టియు, ఫాలమందు పుండ్రమును, హస్తమునందు పాత్రను, కంఠమునందు సర్పమును ధరించినవాడును ఈశ్వరభక్తుడును, శిరస్సు లేనివాడును, భిక్షాటనము చేయువాడును, సూర్యచంద్రాదులను మింగువాడును రాశిచక్రమున గృహము లేనివాడును, ధూమ్రవర్ణము గలవాడును, మోక్షమునొసంగువాడును, నిధిజ్ఞానము నందునూ శకునమునందునూ మంత్రశాస్త్రమునందును ప్రవీణుడయినవాడు, వినాయకభక్తినిచ్చువాడు, మీన రాశియందు ప్రకాశించువాడు, తీర్థసంచారి, కృతజ్ఞత కలి గినవాడు, వైద్యమునెరిగినవాడు, వృశ్చికరాశి ఉచ్ఛగా గలిగినవాడును, వైఢూర్యదానముచే ప్రీతినొందు వాడును, ఏడు సంవత్సరములకాలము గలవాడును, ఆశ్లేషానక్షత్ర జాతకుడును, మృత్యువును జయిం చిన వాడును, కంఠముయొక్క అధోభాగము కలవా డును, మోదుగపూవు భాయగలవాడును, మోక్షకర్త అయిన కేతువును భజింతును.

శ్రీ కేతు స్తోత్రం :

శ్లో॥ ఫలాశ పుష్పసంకాశం
తారకా గ్రహమస్తకం
రౌద్రం రుద్రాత్మకం ఘోరం
తం కేతుం ప్రణమామ్యహం॥
(శ్రీ వ్యాస ప్రోక్తం)

కేతుమంత్ర ధ్యానము :

ధూమ్రవర్ణం ద్విబాహుంచ
కేతుంచ వికృతాననమ్
గృధాసనగతం నిత్యం
ధ్యాయే త్సర్వఫలాప్తయే॥
మంత్రము :

ఓం ప్రాం ప్రీం ప్రౌం సః కేతవేనమః
జపసంఖ్య : 7 వేలు జపముచేయువలయును.

ఫలశ్రుతి :

నపుంసకగ్రహము. జాతకరీత్యాగాని, గోచార రీత్యాగాని చెడుఫలితము లిచ్చినపుడు ధ్యానము చేయువలయును.

—

# నవగ్రహగాయత్రి పారాయణము

ఓం

నవగ్రహ : విశ్వమండలాయ విద్మహే
నవస్థానాయ ధీమహి
తన్నో గ్రహాః ప్రచోదయాత్ ॥ 1

ఓం

భాస్కర : భాస్కరాయ విద్మహే
మహాద్యుతికరాయ ధీమహి
తన్నో ఆదిత్యః ప్రచోదయాత్ ॥ 2

ఓం

జ్యోతి : భాస్కరాయ విద్మహే
జ్యోతిష్కరాయ ధీమహి
తన్నో ఆదిత్యః ప్రచోదయాత్ 3

ఓం

ద్యుతికర : దివాకరాయ విద్మహే
మహాద్యుతికరాయ ధీమహి
తన్నో ఆదిత్యః ప్రచోదయాత్ 4

ఓం

ఆదిత్య : ఆదిత్యాయ విద్మహే
సహస్రకిరణాయ ధీమహి
తన్నో భానుః ప్రచోదయాత్ 5

ఓం

భానుః తత్ భాస్కరాయ విద్మహే
ప్రభాకరాయ ధీమహి
తన్నో భానుః ప్రచోదయాత్ ॥ 6

ఓం

దివాకరః భాస్కరాయ విద్మహే
దివాకరాయ ధీమహి
తన్నః సూర్యః ప్రచోదయాత్ ॥ 7

ఓం

ప్రభాకరః ప్రభాకరాయ విద్మహే
దివాకరాయ ధీమహి
తన్నః సూర్యః ప్రచోదయాత్ ॥ 8

ఓం

మార్తాండః ఆదిత్యాయ విద్మహే
మార్తాండాయ ధీమహి
తన్నః సూర్యః ప్రచోదయాత్ ॥ 9

ఓం

సూర్యః అశ్వధ్వజాయ విద్మహే
పాశహస్తాయ ధీమహి
తన్నః సూర్యః ప్రచోదయాత్ ॥ 10

ఓం

తపన :
భాస్కరాయ విద్మహే
సహస్రరశ్మయే ధీమహి
తన్నః సూర్యః ప్రచోదయాత్ ॥ 11

ఓం

రవి :
అశ్వధ్వజాయ విద్మహే
పద్మహస్తాయ ధీమహి
తన్నః సూర్యః ప్రచోదయాత్ ॥ 12

ఓం

సోమ :
పద్మధ్వజాయ విద్మహే
హేమరూపాయ ధీమహి
తన్నః సోమః ప్రచోదయాత్ ॥ 13

ఓం

విధు :
శీతప్రభాయ విద్మహే
షోడశ కలాయ ధీమహి
తన్నః సోమః ప్రచోదయాత్ ॥ 14

ఓం

నిశానాథ :
విప్రరాజాయ విద్మహే
నిశానాథాయ ధీమహి
తన్నః సోమః ప్రచోదయాత్ ॥ 15

ఓం

చంద్ర : తత్సోమరాజాయ విద్మహే
మహారాజాయ ధీమహి
తన్నశ్చంద్రః ప్రచోదయాత్ ॥ 16

ఓం

ఇందు : క్షీరపుత్రాయ విద్మహే
అమృత తత్త్వాయ ధీమహి
తన్నశ్చంద్రః ప్రచోదయాత్ ॥ 17

ఓం

రాశి : కాశ్యపాయ విద్మహే
కమలనాధాయ ధీమహి
తన్నశ్చంద్రః ప్రచోదయాత్ ॥ 18

ఓం

భౌమ : వీరధ్వజాయ విద్మహే
విఘ్న హస్తాయ ధీమహి
తన్నశ్చంద్రః ప్రచోదయాత్ ॥ 19

ఓం

మంగల : అంగిరసాయ విద్మహే
శక్తి హస్తాయ ధీమహి
తన్నో భౌమః ప్రచోదయాత్ ॥ 20

ఓం

భూసుత : లోహితాక్షాయ విద్మహే
భూలాభాయ ధీమహి
తన్నోఽంగారకః ప్రచోదయాత్ ॥ 21

ఓం

అంగారక : అంగారకాయ విద్మహే
శక్తి హస్తాయ ధీమహి
తన్నో భౌమః ప్రచోదయాత్ ॥ 22

ఓం

బుధ : గజధ్వజాయ విద్మహే
శుక హస్తాయ ధీమహి
తన్నో బుధః ప్రచోదయాత్ ॥ 23

ఓం

సోమపుత్ర : ఆత్రేయాయ విద్మహే
సోమపుత్రాయ ధీమహి
తన్నో బుధః ప్రచోదయాత్ ॥ 24

ఓం

బృహస్పతి : వృషభ ధ్వజాయ విద్మహే
ఘృణి హస్తాయ ధీమహి
తన్నో గురుః ప్రచోదయాత్ ॥ 25

ఓం

గురు : ఆంగిరసాయ విద్మహే
సురాచార్యాయ ధీమహి
తన్నో గురుః ప్రచోదయాత్ ॥ 26

ఓం

గురు : అశ్వధ్వజాయ విద్మహే
ధనుర్ హస్తాయ ధీమహి
తన్నః శుక్రః ప్రచోదయాత్ ॥ 27

ఓం

భార్గవ : భార్గవాయ విద్మహే
అసురాచార్యాయ ధీమహి
తన్నః శుక్రః ప్రచోదయాత్ ॥ 28

ఓం

మంద : కాకధ్వజాయ విద్మహే
ఖంగ హస్తాయ ధీమహి
తన్నో మందః ప్రచోదయాత్ ॥ 29

ఓం

శని : శనైశ్చరాయ విద్మహే
ఛాయాపుత్రాయ ధీమహి
తన్నో మందః ప్రచోదయాత్ ॥ 30

ఓం

సూర్యపుత్ర : కాశ్యపాయ విద్మహే
సూర్య పుత్రాయ ధీమహి
తన్నో మందః ప్రచోదయాత్ ॥ 31

ఓం

రాహు : నగధ్వజాయ విద్మహే
పద్మ హస్తాయ ధీమహి
తన్నో రాహుః ప్రచోదయాత్ ॥ 32

ఓం

భృగుపుత్ర : భృగుపుత్రాయ విద్మహే
సైంహికేయాయ ధీమహి
తన్నో రాహుః ప్రచోదయాత్ ॥ 33

ఓం

కేతు : అశ్వధ్వజాయ విద్మహే
శూల హస్తాయ ధీమహి
తన్నః కేతుః ప్రచోదయాత్ ॥ 34

ఓం

ధూమ : జైమిని గోత్రాయ విద్మహే
ధూమ్రవర్ణాయ ధీమహి
తన్నః కేతుః ప్రచోదయాత్ ॥ 35

## నవగ్రహగాయత్రి తాత్పర్యసహితము

1. ఓం, విశ్వమండలాయ విద్మహే, నవస్థానాయ ధీమహి. తన్నో గ్రహః ప్రచోదయాత్ : గ్రహ మనగాగృహ్ణాతి అదృష్టమితిగ్రహః ప్రాణులను యదృష్టముల గైకొని నడుపునదని వ్యుత్పత్తి, సకల మండలాలను వ్యాపించి, నవస్థానాలకు విభుడై యుండి ఆ గ్రహము మనకు మంచిని మించునట్లు ప్రోత్సహించును.

2. ఓం భాస్కరాయ విద్మహే, మహాద్యుతికరాయ ధీమహి, తన్న ఆదిత్యః ప్రచోదయాత్ : భాసః కరోతీతి భాస్కరః = కాంతులను జేయువాడు. పగలు తనకిరణములను వ్యాపింపజేయువాడు. మహత్×ద్యుతికరాయ = మిక్కిలి కాంతులను జేయువాడు, చేయునట్టి కిరణములు గలవాడు అదితేః అపత్యంపుమాన్=అదితియొక్క కొడుకు అతడు మనలను మంచిదారిలోనికి నడిపించును

3. ఓం, భాస్కరాయ విద్మహే, జ్యోతిష్కరాయ ధీమహి, తన్న ఆదిత్యః ప్రచోదయాత్ : జ్యోతిః కరోతి=జ్యోతిష్కరఃఆయన లగ్నమునముండగా

బుట్టిన వారికి ఆ భాస్కరుని గొలిచిన వారికి బ్రహ్మ తేజస్సు పెరుగును. అట్టి భాస్కరుడు మనల కాపాడుగాక !

4. ఓం, దివాకరాయ విద్మహే, మహాద్యుతికరాయ ధీమహి, తన్నో ఆదిత్యః ప్రచోదయాత్ : దివా కరోతీతి=దివాకరః-కర్మకాండలకు ముఖ్యమైన పగటిని తేయువాఁడుదివాకరుడు ! ఆదిత్యుఁడే అతడు మనల నుద్ధరించుగాక !

5. ఓం, ఆదిత్యాయ విద్మహే, సహస్రకిరణాయ ధీమహి । తన్నో భానుః ప్రచోదయాత్ : ఆది త్యుడై ప్రభాకరుఁడైన భానుఁడు మనల బుద్ధుల మంచిదారిలోనికి ప్రోత్సహించుగాక ! ప్రభాం కరోతీతి ప్రభాకరః- చీకటి లోకము లను కాంతితో నింపుచున్నాడు. అంతేనా ! అతని సేవవలన అజ్ఞానయుక్త మనస్సులును గూడ జ్ఞానముతో నిండును. భానుః=కాంతులను పంపువాఁడు. భాసః నువతీతి=భానుః

6. ఓం, తత్ భాస్కరాయ విద్మహే, ప్రభాకరాయ ధీమహి, తన్నో భానుః ప్రచోదయాత్ : అతనినే

భాస్కరునిగా దెలియుచున్నాము. ప్రభాకరునిగా ధ్యానించుచున్నాము. అట్టి భానుఁడే మా బుద్ధుల ప్రోత్సహించుగాక !

7. ఓం, భాస్కరాయ విద్మహే, ప్రభాకరాయ ధీమహి, తన్నః సూర్యః ప్రచోదయాత్: జీవరాశులను బుట్టించి, వ్యాపింపఁజేయువాఁడే సూర్యుడు ఆ సూర్యుడే మాచిత్తముల మంచి దారిలోనికి ప్రోత్సహించుగాక ! భాస్కరునిగా నెఱిఁగి దివాకరునిగా ధ్యానించుచున్నాము.

8. ఓం, ప్రభాకరాయ విద్మహే, దివాకరాయ ధీమహి, తన్నః సూర్యః ప్రచోదయాత్ : ప్రభాకరునిగా నెఱింగి దివాకరునిగా ధ్యానించుచున్నాము. అ సూర్యుడే మనలను ప్రోత్సహించును.

9. ఓం, ఆదిత్యాయ విద్మహే, మార్తాండాయ ధీమహి, తన్నః సూర్యః ప్రచోదయాత్ : ఈతనిచే యాదిత్యుడుగా దెలిసి మార్తాండునిగా ధ్యానించుచున్నాము. ఆ సూర్యుడు మమ్ముల ప్రోత్సహించుగాక ! మార్తాండః-మృతాండస్య అపత్యంపుమాన్ - మార్తాండః- మరణించిన గ్రుడ్డు నుండి పుట్టినవాఁడు.

10. అశ్వధ్వజాయ విద్మహే, పాశహస్తాయధీమహి, తన్నః సూర్యః ప్రచోదయాత్ : అశ్వముతే రథమునకు జండావలెనే గుర్తు గలవాడు! పైగా నీతని జండాగుర్తు గుఱ్ఱమే. పాశము చేతి యందు గలవాఁడు! దుష్ట సంహారకారి. రాక్ష సాదుల జంపువాడు! అట్టి సూర్యుడే మనల గాపాడుగాక!

11. ఓం, భాస్కరాయ విద్మహే, సహస్రరశ్మయే ధీమహి, తన్నః సూర్యః ప్రచోదయాత్: సహస్ర రశ్మయః యస్యసః-సహస్రరశ్మిః-వేయికిరణ ములు గలవాఁడు భాస్కరుడు సహస్రరశ్మియైన సూర్యుఁడే మనలను గాపాడుగాక!

12. ఓం, అశ్వధ్వజాయ విద్మహే, పద్మహస్తాయ ధీమహి, తన్నః సూర్యః ప్రచోదయాత్ : రవి యనగా ఋగతే-ధాతువుచేత సర్వదా తిరుగు వాఁడు-జ్ఞానదాత అని యర్థము-పద్మముచేతిలో ధరించువాఁడు లక్ష్మీప్రదాత। అశ్వధ్వజుడు। అట్టి సూర్యుఁడు గాపాడుగాఁక!

13. ఓం, పద్మధ్వజాయ విద్మహే, హేమరూపాయ ధీమహి, తన్నః సోమః ప్రచోదయాత్ : పద్మ ధ్వజుఁడనగా చేతిలో పద్మము గుర్తుగలవాఁడు చంద్రునివలన పద్మాలు ముడుచుకొనునుగాన పద్మ సంకోచము చంద్రుని రాకకు గుర్తుకదా! హేమరూపుఁడనగా బంగరుభూమి గలవాడు. అట్టి సోముఁడు మాబుద్ధులను ప్రేరేపించుగాక:

14. ఓం, శీతప్రభాయ విద్మహే, షోడశకలాయ ధీమహి, తన్నః సోమః ప్రచోదయాత్ : విధుడనగా చంద్రుడని యర్థము. ఈతఁడు. చల్లని కాంతి గలవాఁడు. పదియాఱు కళలు గలవాడు. అట్టి సోముఁడు మా బుద్ధులను ప్రేరేపించుగాక;

15. ఓం, విప్రరాజాయ విద్మహే, నిశానాథాయ ధీమహి, తన్నః సోమః ప్రచోదయాత్ : నిశానాధుడు=చంద్రుడు - రాతిరికి విభుఁడు గదా ! విప్రరాజు బ్రాహ్మణులకు బ్రహ్మ క్షత్రియ, వైశ్యులకురాజు ! అట్టి సోముడు ప్రేరేపించుగాక

16. ఓం, తత్సోమరాజాయ విద్మహే, మహారాజాయ ధీమహి, తన్నశ్చంద్రః ప్రచోదయాత్: యాగో

ప్రకరణమైన సోమలతయను తీఁగె యున్నది. ఓషధులన్నిటితోబాటు ఈ సోమలతకుకూడప్రభు వీ చంద్రుఁడే! గ్రహాలను పాలించువాఁడు మహా రాజు ! ఈతఁడందఱకు ఆహ్లాదమును పుట్టించు గాంతి గలవాఁడు గాన చంద్రుఁ డనబడు చున్నాఁడు. ఈతడు మా బుద్ధులను ప్రేరే పించుగాక ! చది ఆహ్లాదనే ! అని ధాతువు.

17. ఓం, క్షీరపుత్రాయ విద్మహే, కమలనాథాయ ధీమహి,తన్నః చ్చంద్రః ప్రచోదయాత్: చంద్రుడు ఇందు, పరమైశ్వర్య సంపన్నుఁడు- క్షీరపుత్రః, క్షీరసాగర జాతుడు- అమృతతత్త్వుడు, అమృత స్వభావముచే- జర వగైరాలు లేనివాఁడు.

18. ఓం, కాశ్యపాయ విద్మహే, కమలనాథాయ ధీమహి, తన్నచ్చంద్రః ప్రచోదయాత్ ॥ చెవుల పిల్లి లాంఛనముగా గలవాఁడుగాన శశియన బడుచున్నాడు. కశ్యపుని కొడుకు సంకోచరూప ముగా పద్మములకు నాథుఁడు గాన కమల నాథుఁడని ఆహ్లాదింపఁజేయు వాఁడుగానచంద్రు డని పిలువబడుచున్నాడు. మాబుద్ధుల నాతఁడు ప్రోత్సహించుగాక !

19. ఓం, వీరధ్వజాయ విద్మహే, విఘ్నహస్తాయ ధీమహి, తన్నో భానుః ప్రచోదయాత్: ర ధ్వజాయ=వీరుఁడనే ధ్వజముగలవాఁడు-విఘ్న హస్తాయ=చేతిలో చేతలలో విఘ్నములు గల వాఁడు - భౌమః=భూమినుండి పుట్టిన=కుజుఁడు మాబుద్ధులను ప్రోత్సహించుగాక! భూమినిచ్చు వాఁడు.

20. అంగిరసాయ విద్మహే, శక్తి హస్తాయ ధీమహి తన్నో భౌమః ప్రచోదయాత్: ఈతఁడుమంగళ ప్రదుఁడు. అంగీరసమహర్షి సంతతిలో వాఁడు, హస్తమున శక్తి గలవాఁడైన ఆ భౌముడు మాబుద్ధులు ప్రోత్సహించుగాక!

21. ఓం, లోహితాక్షాయ విద్మహే, భూలాభాయ ధీమహి, తన్నోంగారకః ప్రచోదయాత్: లోహితాక్షాయ=ఎఱ్ఱని కన్నులు గల భూలాభము గలిగించువాఁడైన అంగారకుఁడు = నిప్పువలెనె యుగ్రుఁడైన – భూసృత=భూమిని గలిగించు కుజుఁడే మాబుద్ధులను ప్రోత్సహించుగాక!

22. ఓం, అంగారకాయ విద్మహే, శక్తి హస్తాయ దీమహి, తన్నో భౌమః ప్రచోదయాత్: అంగా

కుఁడు శక్తి హస్తుఁడునగు భౌముఁడే మాబుద్ధు లను మంచిదారిలో నడిపించుగాక !

23. ఓం, గజధ్వజాయ విద్మహే, శుభహస్తాయ ధీమహి, తన్నో బుధః ప్రచోదయాత్ ॥ బుధుడు చంద్రుని కొడుకు - గజధ్వజుఁడు జెండాపై గజము గుర్తుగా గలవాడు-శుకము చేతిలో గల వాఁడు ! అట్టి బుధుడు మాబుద్ధులను ప్రోత్స హించుగాక !

24. ఓం, ఆత్రేయాయ విద్మహే, సోమపుత్రాయ ధీమహి, తన్నో బుధః ప్రచోదయాత్ ॥ సోమ పుత్రాయ-చందురుని కొమరుఁడైన -ఆత్రే యాయ-అనసూయా - అత్రిమునిదంపతులకు కొడుకైన చంద్రుని కొడుకైన బుధుఁడు (తెలి సినవాఁడు) మాబుద్ధుల ప్రోత్సహించుగాక !

25. ఓం, వృషభధ్వజాయవిద్మహే, ఘృణిహస్తాయ ధీమహి, తన్నోగురుః ప్రచోదయాత్ ॥ బృహ తాంపతిః గొప్పవారికి ప్రభువు - ఎద్దు జండా యందుగల-ఘృణి చేతిలో గల అజ్ఞాననాశకుఁ డైన గురుఁడు ప్రచోదించుగాక !

26. ఓం, ఆంగిరసాయ విద్మహే, సూరాచార్యాయ ధీమహి, తన్నో గురుః ప్రచోదయాత్ ॥ ఈ బృహస్పతి ఆంగీరసుని కొడుకు. దేవతల కాచారుఁడునగు గురుడు మాబుద్ధుల మంచిదారి లోనికి ప్రోత్సహించుగాక !

27. ఓం, అశ్వధ్వజాయ విద్మహే, ధనుర్ హస్తాయ ధీమహి, తన్నో శుక్రః ప్రచోదయాత్ : శుక్రుడు జెండా మీద గుఱ్ఱము గలవాడై చేతిలోధనుస్సు గలవాఁడైన శుక్రుడు మంచి తేజస్సుగలవాఁడు మాబుద్ధులను ప్రోత్సహించుగాక !

28. ఓం, భార్గవాయ విద్మహే, అసురాచార్యాయ ధీమహి, తన్నః శుక్రః ప్రచోదయాత్ : ఈ శుక్రుఁడు భృగువంశమున పుట్టినవాఁడై రాక్షస గురువైన వాఁడు మాబుద్ధులను ప్రోత్స హించుగాక !

29. ఓం, కాకధ్వజాయ విద్మహే, ఖంగహస్తాయ ధీమహి,తన్నో మందః ప్రచోదయాత్:మందుఁడు మెల్లగా నడచువాఁడు, కుంటివాడు. జెండాపై కాకి గుర్తు గలవాడై చేతిలో పక్షి గలవాడై మందుఁడను శని రక్షించుగాక !

30. ఓం, శనైశ్చరాయ విద్మహే ఛాయాపుత్రాయ ధీమహి, తన్నః కృష్ణః ప్రచోదయాత్ : శని- మెల్లగ నడుచువాడు. సూర్య భగవానుని రెండవ భార్య ఛాయకు కుమారుడు. కృష్ణం నల్లనిశని గాపాడుగాక !

31. ఓం, కాశ్యపాయ విద్మహే, సూర్యపుత్రాయ ధీమహి, తన్నో మందః ప్రచోదయాత్: సూర్యుని కొడుకు కశ్యప ప్రజాపతి వంశములోని వాడైన మందుడు మాబుద్ధును ప్రోత్సాయించుగాక !

32. ఓం, నగధ్వజాయ విద్మహే, పద్మహస్తాధీమహి, తన్నో రాహుః ప్రచోదయాత్ : సింహికయను రక్కసి తనయుడు. ఈతని కొండ జండాపై గుర్తు చేతిలో పద్మముండును. శరీరమున తల భాగమునకు రాహువని-మొండెమునకు కేతు వను పేరుగల రాహువనుగ్రహము మమ్ము రక్షించుగాక !

33. ఓం, భృగుపుత్రాయ విద్మహే, సైంహికే యాయ ధీమహి, తన్నో రాహుఃప్రచోదయాత్: రాహువు భృగుముని వంశీయుడు ! సింహిక కొడుకు మమ్ములను కాపాడుగాక !

34. ఓం, అశ్వధ్వజాయ విద్మహే, శూలహస్తాయ ధీమహి, తన్నః కేతుః ప్రచోదయాత్ :- కేతు వనగా జెండావలె నుండు తమోగ్రహము. శూలము చేతిలోగలవాఁడు. అట్టి కేతువు కాపాడు గాక !

35. ఓం, జైమిని గోత్రాయ విద్మహే, ధూమ్ర వర్ణాయ ధీమహి, తన్నః కేతుః ప్రచోదయాత్ : ఈ కేతువు జైమినిముని గోత్రకుఁడు. నల్లని రంగు గలవాడు అగు కేతువు మమ్ము గాపాడు గాక!

---

## —: నవగ్రహములు—అందలి ముఖ్యాంశములు :—

| గ్రహము | ఋషి | దేవత | ఛందస్సు | గోత్రము | జాతకము | రాశి |
|---|---|---|---|---|---|---|
| 1. రవి | హిరణ్య | సవితా | త్రిష్టుప్ | కాశ్యపస | అశ్వని | సింహ |
| | స్తూపఋషి | దేవత | ఛందస్సు | గోత్రం | నక్షత్రం | రాశి |
| ౨. చంద్రుడు | గౌతమ | చంద్రుడు | గాయత్రీ | ఆత్రేయస | కృత్తికా | కర్కాట |
| | ఋషి | దేవత | ఛందస్సు | గోత్రం | నక్షత్రం | రాశి |
| ౩. కుజుడు | విరూప | అంగారక | త్రిష్టుప్ | భరద్వాజస | అనూరాధ | మేష |
| (అంగారకుడు) | ఋషి | దేవత | ఛందస్సు | గోత్రం | నక్షత్రం | వృశ్చిక |
| 4. బుధుడు | ప్రస్కణ్వ | బుధగ్రహ | త్రిష్టుప్ | ఆత్రేయస | పూర్వా | మిధున |
| | ఋషిః | దేవత | ఛందస్సు | గోత్రం | భాద్ర | కన్య |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 5. | గురుడు | గృత్సమద | బృహస్పతి | త్రిష్టుప్ | ఆంగీరస | ఉత్తరా | ధను |
| | | ఋషి | దేవత | ఛందస్సు | గోత్రం | నక్షత్రజాతకం | మీన |
| 6. | శుక్రుడు | భరద్వాజ | శుక్రగ్రహ | త్రిష్టుప్ | భార్గవస | స్వాతీ | తులా |
| | | | దేవత | ఛందస్సు | గోత్రం | నక్షత్రం | వృషభ |
| 7. | శని | హిళిభి | శనిగ్రహ | ఉష్ణిక్ | కాశ్యపస | భరణీ | మకర |
| | | ఋషి | దేవత | ఛందస్సు | గోత్రం | నక్షత్రం | కుంభ |
| 8. | రాహువు | వామదేవ | రాహుగ్రహ | గాయత్రీ | పైఠీనస | విశాఖా | సింహ |
| | | ఋషి | దేవత | ఛందస్సు | గోత్రం | నక్షత్రం | రాశి |
| 9. | కేతువు | మధు | కేతుగణ | గాయత్రీ | జైమినీ | రేవతీ | కర్కాట |
| | | చ్ఛంద | దేవత | ఛందస్సు | గోత్రం | నక్షత్రం | రాశి |

| గ్రహములు | దేశాధిపతి | రంగు | వారము | ఫలము | పారాయణగ్రంథము |
|---|---|---|---|---|---|
| 1. రవి | కళింగదేశాధిపతి | రక్తవర్ణం | ఆదివారం | రోగబాధల ముక్తి | హరివంశపురాణ శ్రవణము |
| 2. చంద్రుడు | యామున దేశాధిపతి | శ్వేతవర్ణం | సోమవారం | దేహారోగ్యము ధనలాభము | శివస్తుతి |
| 3. కుజుడు (అంగారకుడు) | అవంతిదేశాధిపతి | రక్తవర్ణం | మంగళవారం | ఋణబాధతీరుట | శివస్తుతి |
| 4. బుధుడు | మగధదేశాధిపతి | పీతవర్ణం | బుధవారం | మనోరధసిద్ధిబంధు సఖ్యతవ్యాపారలాభం | అమావాస్యవ్రతము |
| 5. గురుడు | సింధుద్వీపాధిపతి | పీతవర్ణం | గురువారం | శుభకార్యములకు సంతానలాభములకు | అమావాస్యవ్రతము |



| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 6. | శుక్రుడు | కాంభోజదేశాధిపతి | శ్వేతవర్ణం | శుక్రవారం | సుఖదాంపత్యము ఆయురారోగ్యము | గోపూజ |
| 7. | శని | సౌరాష్ట్రదేశాధిపతి | నీలవర్ణం | శనివారం | కార్యసిద్ధి గ్రహ-బలముకొఱకు | మృత్యుంజయ జపము |
| 8. | రాహువు | బర్బరదేశాధిపతి | నీలవర్ణం | — | దారిద్ర్యబాధ-తొలగుటఅదృష్ట వంతులగుటకు | మృత్యుంజయ జపము |
| 9. | కేతువు | అంతర్వేదిదేశాధిపతి | చిత్రవర్ణం | — | చోరాగ్నిబాధలు పిశాచబాధలుపోవుట | మృత్యుంజయ జపము |

## —: గ్రహములు—నవరత్నములు—ఉంగరములలో నవరత్నధారణ :—

విధానము:— జాతకరీత్యా వర్తమానములో ఏ మహాదశ జరుగుచున్నదో దాని కనుగుణముగా వాటికి నిర్దేశింపబడిన రత్నమును పొదగబడిన ఉంగరమును ధరించుట వలన శుభఫలితములు పొందవచ్చును. రత్నము ప్రమాదమునుండి కాపాడును. నామ నక్షత్రమును బట్టి కూడ ఆగ్రహాధి పతికి సంబంధించిన రత్నమును పొదగవచ్చును. జననకాలము తెలియని ఎడల నామనక్షత్రమును తీసుకొనవచ్చును.

—: ఉంగరమున నవరత్నములు ఉంచవలసిన విధానము :—

| శుక్ర | చంద్ర | కుజ |
|---|---|---|
| బుధ | సూర్య | రాహు |
| గురు | కేతు | శని |

| వజ్రం | ముత్యము | పగడము |
|---|---|---|
| పచ్చ | కెంపు | గోమేధికము |
| పుష్యరాగం | వైఢూర్యము | నీలము |

నవరత్నములు పొదిగిన ఉంగరము ధరించుట వలన, సకల దోషములు తొలగి సర్వత్ర జయము చేకూరును.

## —: నవగ్రహములకు దానములు :—

రాహుకేతులనునవి గ్రహములు కావు. ఇవి ఛాయాగ్రహములు. అందుచే వీటికివారములు చెప్పబడియుండలేదు. అందుచే రాహుకేతులకు దానము అదివారము ఇచ్చుట మంచిది, శనివత్ రాహువు, కుజవత్ కేతువు అని చెప్పబడియుండుటచే రాహువు శనికి సమానుడు, కేతువు కుజసమానుడు

రాహువునకు శనివారము ఉదయము, కేతువునకు మంగళవారము ఉదయము దానములు ఇవ్వవచ్చును.

# నవగ్రహ గాయత్రి

| | | | | |
|---|---|---|---|---|
| 1. | రవికి | అదివారము | ఉదయము | గోధుమలు |
| 2. | చంద్రునకు | సోమవారము | ,, | బియ్యము |
| 3. | కుజునకు | మంగళవారము | ,, | కందులు |
| 4. | బుధునకు | బుధవారము | ,, | పెసలు |
| 5. | గురునకు | గురువారము | ,, | సెనగలు |
| 6. | శుక్రునకు | శుక్రవారము | ,, | బొబ్బర్లు |
| 7. | శనికి | శనివారము | ,, | నువ్వులు |
| 8, | రాహువునకు | శనివారము | ,, | మినువులు |
| 9. | కేతువు | మంగళవారము(శనివారము) | ,, | ఉలవలు |

# ఋగ్వేద, యజుర్వేదములందున్న నవగ్రహ మంత్రములు

1. సూర్యమంత్రము :–

ఓం ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశ యన్నమృతం మర్త్యంచ। హిరణ్యేన సవితా రథేనాఽఽ దేవోయాతి భువనాని పశ్యన్

(ఋగ్వేదము 1-35-2; యజుర్వేదము 33-43)

ఓం భూర్భువః స్వః సూర్య ఇహాగచ్ఛ ఇహ సః సూర్యాయనమః

బీజమంత్రము :–

ఓం హ్రాం హ్రీం హ్రౌంసః సూర్యాయనమః

8000 జపము–ఉదయకాలము

2. చంద్రమంత్రము :–

ఓం ఇందేవా అసపత్నం సువధ్వం మహతే క్షత్రాయ మహతే జ్యేష్ఠాయ మహతే జ్ఞాన రాజ్యాయేంద్ర స్యేంద్రియాయ। ఇమమముష్య పుత్రమముష్యై పుత్రమస్యై విశాఽ ఏషవోఽమీరాజా సోమోఽస్మాకం బ్రాహ్మణానాంరాజా ॥

యజుర్వేదము 9-40)

ం భూర్భువః స్వః చంద్ర ఇహాగచ్ఛ ఇహతిష్ఠ సోమాయనమః ॥

బీజమంత్రము :-
ఓం శ్రాం శ్రీం శ్రౌం సః చంద్రాయనమః
జపము 11,000 సంధ్యాకాలసమయము.

3. మంగళమంత్రము :-
ఓం అగ్నిర్మూర్ధా దివః కకుత్పతిః పృధివ్యా అయం। అపాంరేతాంసి జిన్వతి ॥
ఋగ్వేదము 8-44-16; యజుర్వేదము (13-14)
ఓం భూర్భువః స్వః భౌమ ఇహాగచ్ఛ ఇహతిష్ఠ। భౌమాయనమః ॥

బీజమంత్రము :-
ఓం క్రాం క్రీం క్రౌం సఃభౌమాయనమః।
జపము 10,000, రెండుగంటల సమయము

4. బుధమంత్రము :-
ఓం, ఉద్బుధ్య స్వాగ్నే ప్రతిజాగృహిత్వమిష్టా పూర్తేం సంసృజేదామయంచ అస్మిస్సధస్థే అధ్యుత్తరస్మిన్ విశ్వేదేవా యజమానశ్చసీదత ॥
(యజుర్వేదము 15-54)

ఓం భూర్భువః స్వః బుధ ... ఇహతిష్ఠ బుధాయనమః ॥
బీజమంత్రము :-
ఓం బ్రాం బ్రీం బ్రౌంసః బుధాయనమః
జపము 18,000 5గంటల సమయం

5. గురుమంత్రము :-
ఓం బృహస్పతే అతియదర్యో అర్హాద్ద్యుమద్ విభాతి క్రతుమజ్జనేషు । యద్దీదయచ్ఛవస ఋతప్రజాత తదస్మాసు ద్రవిణం దేహిచిత్రమ్ ॥
(ఋగ్వేదము 2-23-25, యజుర్వేదం 26-3)
ఓం భూర్భువః స్వః బృహస్పతే ఇహాగచ్ఛ ఇహతిష్ఠ । బృహస్పతయేనమః ॥
బీజమంత్రము :-
ఓం, గ్రాం గ్రీం గ్రౌంసః గురవేనమః
జపము 19,000 సంధ్యాకాల సమయము.

6. శుక్రుడు :-
మంత్రము :-
ఓం, అన్నాత్పరిశ్రుతోరసం బ్రహ్మణాన్యపిబత్ క్షత్రం పయః సోమం ప్రజాపతిః । ఋతేన సత్యమింద్రియం విపానాం శుక్రమంధస ఇంద్ర

స్యేంద్రియ మిదం పయోఽ మృతం మధు॥
(యజుర్వేదము 19-65)
బీజమంత్రము :-
ఓం ద్రాం ద్రీం ద్రౌంసః శుక్రాయనమః
జపము 1,600 సూర్యోదయ సమయము,

7. శని :-
ఓం శంనో దేవీరభిష్టయ ఆపోభవంతు పీతయే।
శంయోరభిస్రవంతునః॥
(ఋగ్వేదము 10-9-4; యజుర్వేదము 36-12)
ఓం భూర్భువఃస్వః శనైశ్చర ఇహాగచ్ఛ ఇహ తిష్ఠ। శనైశ్చరాయనమః
బీజమంత్రము :-
ఓం ప్రాం ప్రీం ప్రౌంసః శనైశ్చరాయనమః
జపము 23,000 సంధ్యాకాల సమయము.

8. రాహు :-
మంత్రము :-
ఓం కయానాశ్చిత్ర ఆభువదూతీ సదావృధఃసఖా।
కయాశాశ్చిష్ఠయావృతా॥
(ఋగ్వేదము 4-31-1; యజుర్వేదము 26-39)

290



ఓం భూర్భువః స్వః రాహో ఇహాగచ్ఛ ఇహతిష్ఠ।
రాహవేనమః

బీజమంత్రము :-
ఓం భ్రాం భ్రీం భ్రౌంసః రాహవేనమః
జపము 18,000 రాత్రి సమయము.

9. కేతువు :
మంత్రము :
ఓం కేతుం కృణ్వన్న కేతవే పేశో మర్యా అపే
శసే। సముపద్భి రజాయథాః ॥
(ఋగ్వేదము 1-6-3; యజుర్వేదము 29-37
బీజమంత్రము :-
ఓం, స్త్రాం, స్త్రీం, సౌం, సః। కేతవేనమః
జపము :- 17,000 రాత్రి సమయము.

---

## —: నవగ్రహ కవచము :—

ఓం శిరోమేపాతు మార్తాండః కపాలం రోహిణీపతిః
మృఖమంగారకః పాతు కంఠంచ శశినందనః ॥
బుద్ధింజీవః సదాపాతు హృదయం భృగునందనః
జఠరంచ శనిఃపాతు జిహ్వాంమేఽదితి నందనః॥
పాదౌకేతుః సదాపాతువారాః సర్వాంగమేవచః
తిథయోఽష్టౌ దిశఃపాంతు నక్షత్రాణివపుఃసదా ॥
అంసౌరాశిః సదాపాతుయోగశ్చ శ్త్స్వైర్యమేవచ
సుచిరాయుః సుఖీపుత్రీ యుద్ధేచ విజయీభవేత్
రోగాత్ప్రముచ్చతే రోగీ బంధో ముచ్యేతబంధనాత్ ॥
శ్రియంలభతేనిత్యం రిష్టస్తస్య నజాయతే
యఃకరే ధారయేన్నిత్యం తస్యనష్టిర్నజాయతే
పఠనాత్ కవచస్యాస్య సర్వపాపాత్ ప్రముచ్యతే
మృతవస్యాచయానారీ కాకవంధ్యాచయా భవేత్ ॥
జీవవస్యా పుత్రవతీ భవత్యేవ నసంశయః
ఏతాంరక్షాం పఠేద్యస్తు అంగం స్పృష్ట్వాపివాపఠేత్

---

## —: నవగ్రహగాయత్రీ స్తోత్రఫలితము :—

శ్లో॥ త్రికాలంయే జపేన్మర్త్యః స్తోత్రమేతత్సుధీవరః
తస్మైదద్యుస్సుఖం తుష్టాః దశాస్వంతర్దశాసుచ॥

294.592
SUR

3
Acc no. 8644

నవగ్రహ గాయత్రి

భావము :- త్రికాలములయందు ఎవ్వడీస్తోత్రమును జపించుచున్నాడో అట్టివానికి దశాంతర్దశల యందు గ్రహములు మంగళములనొసంగును.

శ్లో॥ అరిష్టాని ప్రణశ్యంతు దురితాని భయానిచ
శాంతిరస్తుగ్రహాః సర్వేకుర్వంతు స్సర్వమంగళం॥

భావము :- ఎవ్విధమైన బాధలు కలుగక, నష్టములు, భయముతొలగి, గ్రహశాంతిజరిగి, సర్వశుభమంగళములు సర్వత్ర కలుగును.

.... .... ....

శ్రీ గాయత్రీ కరుణాకటాక్ష శోభితుండును, కౌండిన్యస గోత్రుండును, ఆపస్తంబసూత్రుండును, కృష్ణయజుశ్శాఖాధ్యాయియు శ్రీ కల్లూరి శ్రీరాములు సీతమ్మ పుణ్యదంపతుల తృతీయపుత్రుండును శ్రీ శ్రీపాద నారాయణమూర్తి దౌహిత్రుండును, రెడ్డి పోలవరము, పశ్చిమగోదావరిజిల్లా జన్మవాసియునగు కల్లూరి సూర్యనారాయణచే విరచితమగు నవగ్రహ గాయత్రీ స్తోత్రము సర్వము సంపూర్ణము.

శ్రీః